గోలకొండపత్రిక
ప్రమోదూత నామ సం|| శ్రావణ శు|| ౧
శనివారము

# మనవిద్యాస్థితి: ప్రభుత్వధర్మము

హిందూస్థానము యొక్క విద్యాపరిస్థితుల గూర్చి తెలుసుకొనుటకు గాను హార్టాగ్ కమిటి యొకటి నియమింపబడెను. వీరు భారతదేశమంతయును సంచారముచేసి విద్యాస్థితి గతులు తెలిసికొని తమ నివేదికను సైమన్ సంఘము వారికి సమర్పించుకొనిరి. ఈ కమిటీ వారు తమ నివేదికలో భారతవర్ష విద్యాస్థితి యెట్లు నిరుత్సాహకరముగా నున్నదో తేటపరచియున్నారు. దానిని వేరొకచో ప్రకటించియున్నాము. వీరు బ్రిటిషు ఇండియాయందలి పరిస్థితులే గాక స్వదేశ సంస్థానములందలి స్థితిగతుల గూర్చి తమ యభిప్రాయము నొసగియున్నారు. ముఖ్యముగా మన నిజాం రాష్ట్రము గూర్చి దిగువ వాక్యములు వ్రాసిరి:—

"స్వదేశసంస్థానములలో పెద్దదియగు హైద్రాబాదు సంస్థానమునందు ఆయిదు సంవత్సరముల వయస్సుకన్న హెచ్చయినవారగు పురుషులలో ప్రతిశతము ౭ మాత్రమే చదువువచ్చినవారున్నారు. దీనివలన బ్రిటిషు ఇండియాలోని చదువువచ్చినవారి సంఖ్యకన్న ఈరాష్ట్రము ఎంత వెనుకబడియున్నదో విదితమగును.)

గత జనపరిగణనపు లెక్కలవలన మనలో ప్రతిశతి ముగ్గురు మాత్రమే చదువుకొనినవారు గలరని మనకు తెలిసిన విషయమే. దీనివలన నిజాం రాష్ట్రములో విద్యావ్యాపకమెంత మందముగ నడచుచున్నదో తెలియనగు. ఈ పది సంవత్సరములలో మన ప్రభుత్వమువారు విద్యాశాఖకై అమిత ధనము వ్యయపరచియున్నారు. ప్రతిసంవత్సరము ౭౦ లక్షల రూపాయిలు విద్యకై వెచ్చింపబడుచున్నవి. అయినను విద్యావంతుల సంఖ్య హెచ్చకుండుట శోచనీయము.

ఈ మందగమనమునకు కారణములు లేకపోలేదు. ప్రభుత్వమువారున్నత విద్యకై విశేషముగ ఖర్చు చేయుచున్నవారే కాని ప్రజలలో ప్రాథమికవిద్య వ్యాపించుటకుగాను అధిక మొత్తము వ్యయపరచుచుండుట లేదు. లక్షలు వెచ్చించి ఉస్మానియా విశ్వవిద్యాలయము స్థాపింపబడినది కాని గ్రామములలో యెన్నియో ప్రాథమిక పాఠశాలలు మూసివేయబడినవి. ఇంతియకాక సన్ ౧౩౩౫ ఫ. నుండి గ్రామములలో ఖాస్గీ పాఠశాలలు నెలకొల్పకుండ ఆజ్ఞాపింపబడినది. ప్రజలీ నిరంకుశ శాసనమును తొలగించుటకు గాను యెన్నియో సారులు మొఱలిడుచున్నను ప్రభుత్వమువారు పెడచెవిని బెట్టుచున్నారు. ప్రభుత్వమువారు నిచ్చు ౭౦ లక్షలలో విశేషించి పెద్ద అధికారుల వేతనములకే ఖర్చైపోవుచున్నది. కొంత యూరోపుఖండ విద్యార్థి వేతనముల కొఱకును, కొంత అనవసర వ్యయములకును సరిపోవుచున్నది. మిగత స్వల్పభాగము నిజమైన విద్యాప్రచారమునకు ఖర్చగుచున్నది.

ఇదిగాక ప్రభుత్వమువారి విద్యావిధానము కూడ ప్రజల నాకర్షించుటలేదు. అందు కొరకే వారు తమ కనుకూలించు విద్య వీధిబడులలో చెప్పించుకొందురు. ఉస్మానియా విశ్వవిద్యాలయ విధానము ఉన్నతవిద్య నభ్యసించు హైందవుల నాకర్షించుటలేదు. ఉర్దూ కోటానుకోట్ల ప్రజలయొక్క మాతృభాష కాజాలదనియు, దానిమూలమున విద్య నేర్పుట పాడిగాదనియు పలువురు రాష్ట్ర, రాష్ట్రేతర ప్రముఖులు అభిప్రాయము నొసగియున్నారు. దేశభాషలలోనే బోధించదలచిన రాష్ట్రము యొక్క ముఖ్యభాషలగు ఆంధ్ర మహారాష్ట్ర భాషలలో నేర్పుట కేర్పాట్లు జేయుటవసరమని రాష్ట్రమునందలి విద్యాప్రవీణులు కోరిరి. కొందరు విద్యాకోవిదులు కనీసము ఉన్నత పాఠశాల మట్టుకు ప్రజల మాతృభాషలో విద్యగఱపుట యుత్తమమని నివేదించిరి. అదియును గాక గత వత్సరము రాజప్రతినిధియగు ఇర్విన్ ప్రభువుగారీ నగరమునకు విచ్చేసినపుడు ఉస్మానియా విశ్వవిద్యాలయమును రాష్ట్రమునందలి అధిక సంఖ్యాకులగు హైందవుల నాకర్షించునట్లు మార్పులు జేయవలయునని సూచించిరి. కాని శ్రీ వైస్రాయిగారి కోరికకూడ అరణ్యరోదనమయిపోయెను.

మన రాష్ట్రమున అన్ని శాఖలలో వలె విద్యాశాఖయందు కూడ పరిపాలనా సౌష్టవము గన్పట్టుటలేదు. పేరుకుమాత్ర మెందరో అధికారులున్నారు. కాని వారు మాత్రము తమ విధాయకములను నెరవేర్చుచుండుట లేదు. పాఠశాలల యందును, కళాశాలల యందును, పెద్దపెద్ద డిగ్రీలుగల అధ్యాపకులున్నారు. కాని వారిలో శ్రద్ధతోను, బోధించు సమర్థులు స్వల్పముగా నున్నారు. విద్యాశాఖయొక్క ఉన్నతాధికారులలో తమ మిత్రులను, చుట్టములను, చేర్చుకొనుచుండునంతవరకు ఫలితము నింతకన్న బాగుగ నుండునా? రాష్ట్రమునందలి అవిద్యాంధకారము పటాపంచలగునా? చదువుకొనినవారిసంఖ్య వృద్ధిపొందునా? ప్రజలలో విద్యపై వ్యామోహము తరుగక పెరుగునా?

మన ప్రభుత్వమువారు తాముచేయుచున్న ఘనకార్యముల జూపుటకు కావలసిన తయ్యారీలన్నియు చేసికొని హార్టాగ్ కమిటి వారిని ఉస్మానియా విశ్వవిద్యాలయమును వీక్షించుటకు గాను ఆహ్వానించిరి. వారదే ప్రకారము వచ్చి విద్యాలయమును తిలకించిరి. తాము చేయుచున్న కృషిని ప్రశంసించెదరని వారు తలచిరి. కాని పైన వ్రాసిన వాక్యముల వలన వారి ఆశ వట్టి అడియాశయయ్యెను. సూక్ష్మదర్శులగు వారికి రాష్ట్రమునందున్న లోపములు గన్పట్టకుండునా?

ఇంత మట్టుకు మేము మన విద్యావిహీనస్థితికి పరిపాలనా సమర్థతయు, తగు ఉపాధ్యాయులును, విద్యావిధానము లేకుండుటయు, ఉన్నతవిద్యకై హెచ్చు మొత్తము వ్యయపరచుటయు, ప్రజలు చేయు విద్యాప్రచార మరికట్టుచుండుటయు ముఖ్యకారణములని నివేదించితిమి. విద్యాకోవిదులందఱును నిదే యభిప్రాయము కలవారని తలంతుము. అట్టిచో యీ దుస్థితి యెన్నటికైన తొలగునా యని విచారము కలుగును. ప్రభుత్వమువారీ లోపములను తొలగించిన తప్పక రాష్ట్రములో విద్యావంతుల సంఖ్య హెచ్చుననుటలో సందియములేదు. ఈ విషయమున మేము దిగువ సూచనలను గావించుచున్నాము. వాని ప్రభుత్వమువారాచరణయందుంచెదరుగాక!

(౧) ప్రాథమిక విద్య నిర్బంధము గనుచితముగను చేయవలయును.

(౨) ముఖ్యముగ ప్రాథమిక విద్య ప్రజల మాతృభాషయందే నేర్పవలయును. మాధ్యమిక తరగతులలో ఉర్దూ రెండవభాషగ నేర్పవచ్చును.

(౩) విద్యావిధానమునందు బ్రిటిషు ఇండియా పాలసీ ననుసరించక దేశమున కనుకూలించునట్టియు ప్రజల యవసరములను దీర్చునట్టియు ప్రణాళిక సిద్ధపరుచవలయును.

(౪) సాంకేతిక విద్యా పాఠశాలలను, వ్యవసాయ పాఠశాలలును, ప్రతి తాలూకా కొకటి స్థాపించవలయును.

(౫) ప్రతి గ్రామమున నొక పాఠశాల తప్పక నుండవలయును.

(౬) సన్ ౧౩౩౫ ఫ. ఖాస్గీ పాఠశాలల శాసనమును రద్దుచేయవలయును.

(౭) విద్యాసంస్థలు స్థాపించుటకును, ప్రభుత్వమువారి విద్యాశాఖపై స్వేచ్ఛగ తమ యభిప్రాయమును వెల్లడించుటకును, ప్రజలకు హక్కు ప్రసాదించవలయును.

(౮) విద్యా విషయిక సభలు జరుపుటకొఱకెట్టి ఆటంకము లుండరాదు. ఇటీవల అన్ని సభలకై జిల్లాధికారుల ఆజ్ఞ బడవలయునని ఆజ్ఞాపింపబడిన గష్తీని వెంటనే రద్దుచేయవలయును.

(౯) ప్రతి పాఠశాలయందు వ్యాయామమునకై వసతి గల్పించి బాలబాలికలకు వ్యాయామము నిర్బంధ మొనర్చవలయును.

(౧౦) ప్రభుత్వమువారు ఆదాయ వ్యయపత్రికయందు నిర్ణయించిన ౭౦ లక్షల రూపాయిలలో కనీసము సగము మొత్తము ప్రాథమిక విద్యకై వ్యయపరుచవలయును. అవసరమగుచో ప్రాథమిక సాంకేతిక విద్యలకై హెచ్చు మొత్తము నొసంగుటకు గాను విద్యకై నిర్ణయింపబడిన మొత్తమును హెచ్చింపవలయును.

ప్రస్తుతపు స్థితి నివారణకై మేము కొన్ని ముఖ్యమగు సూచనలనే గావించితిమి. ఇవిమా సొంత యభిప్రాయములేగాక రాష్ట్రమునందలి అధిక సంఖ్యాకులగు ప్రజలసూచనలును నైయున్నవి. ఇట్టి సూచనలే గత ప్రజాపక్ష విద్యా మహాసభయందు గావింపబడినవి. వానిగూర్చి ప్రభుత్వమువారు ముఖ్యముగా విద్యాశాఖాధికారులెట్టి ఆజ్ఞలనేగాని అభిప్రాయమేగాని తెలుపనందున మరల నీ సందర్భమున నివేదించవలసి వచ్చినది. ఎన్ని యోగండములు గడతేరిన పిదప కొలదిరోజులలోనే మరల ప్రజాపక్ష విద్యా మహాసభయొక్క ద్వితీయ సమావేశముగా నున్నది. అందీవిషయములే చర్చించి మరల ప్రభుత్వమువారికి సూచింపబడుననుటలో నెట్టి సందియములేదు. ప్రజలు తమ ధర్మములను వీలగునంతవరకు నెరవేర్చుచున్నారు. ప్రజలకు విద్యపై వ్యామోహము లేదనునింద మాత్రము తొలగుచున్నది. కనుక ప్రభుత్వమువారిపైననే కర్తవ్యకర్తలు వేయబడుచున్నవి. వారు శ్రద్ధ వహించినచో రాష్ట్రమభివృద్ధిజెంది కొంథు సంస్థానమువలె భారతవర్షమున కీర్తి నొందును. లేనిచో యెన్ని సంవత్సరములు గడచినను ఎన్ని కమిషనులు వచ్చినను సైమన్ సంఘమువారు సూచించిన అభిప్రాయమునే మరల మరల సూచించుచుందురనుటలో సందియమేమి? తమను కీర్తించెదరని ఆశపెట్టుకొనియున్న ప్రభుత్వమువ

# జయకరు సప్రూ రాయబారము

ర్కినైన ముఖ్య సంస్కరణములు విద్యావిషయమున శ్రద్ధవహించి లోపములు తొలగించుటకు కృషి సల్పెదరా?

పాఠశాలల ఫీసు

మన విద్యాశాఖవారు చదరుఘాటు సిటీ కాలేజిపాఠశాలలతరగతులఫీసు హెచ్చించుచున్నొక మురాసిలా జారీచేసి యున్నారు. ఇట్లు హెచ్చించుట కేమి కారణములు కలిగినవో మాకు తెలియకున్నది. ముఖ్యముగా బాలబాలికలకు విద్యావ్యయములు స్వల్పముగ నుండవలయు ననియు, లేనిచో బీదసాదలు తమ బాలురకు విద్య చెప్పించజాలరనియు, అందరికిని తెలిసిన విషయమే. ఇట్టియెడ ఫీసు నెందులకు హెచ్చింపబడినది? పైన మేము వ్రాసినటుల యిట్టి ఆటంకములు కల్పించుచుండిన ప్రజలలో విద్యావ్యాపకము కాజాలదు. ఇకనైనను విద్యాశాఖవారు శ్రద్ధవహించిన మేలు. ఈ శాఖాధ్యక్షులగు ఖాన్ ఫజల్ మహమ్మద్ ఖాన్ సా॥ రాష్ట్రము యొక్క విద్యా విషయములగూర్చి పూనుకొనెదరు గాక యని కోరుచున్నాము. లేనిచో వారింతకు మున్ను సమర్థులగు ప్రధానోపాధ్యాయులని గడించిన కీర్తికి కళంకము కలుగు ననుటలో ఆశ్చర్య మేమి?

## సప్రూ జయకరు రాయబారము

### సప్రూగారి ఆనందపడనముచే కొంతఆశ జనించుచున్నది.

డా॥ సప్రూగారు అలహాబాదునుండి బొంబాయికి ఈ నెల ౨౨ వ తేదిన చేరిరి. జయకరుగారి అల్లుడు అకాల మరణ మొందుటచే గాంధీగారిని దర్శించుటలో కొంత ఆలస్య మయ్యెను. ఈ యిరువురు మితవాద నాయకులు పూనహా నగరమునకు ఈ నెల ౨౩ వ తేదిన జేరిరి వీరు పదకొండున్నరగంటలకు ఎరవాడ జేలునకు చేరిరి వీరు గాంధీగారితో మూడున్నర గంటలవరకు మాట్లాడిరి ఏమిజరిగినదో తెలియదుకాని సప్రూగారు మందహాస వదనముతో చెరసాల వెలుపలికి వచ్చిరి. సప్రూగారు మూడు బుట్టల పండ్లు గాంధీ గారికి దీసుకపోయి నిచ్చిరి. ఏమి జరిగినదో తెలుపుటకు పత్రికా విలేఖరులు కోర వారిపు వేమియు తెలుపుటకు నిరాకరించిరి అనంతరము నాయకులు శ్రీమతి సరోజనీ దేవిగారిని సందర్శించిరి.

పూనహా నగరమున ఈ రాయబారము గూర్చి ప్రజలెట్టి ఆతురత జూపుటలేదు. జయకరు సప్రూగార్లు జైలునకు వెడలు నపుడు వారివెంట జైలు అధికారియగు మార్టిన్ గారుండిరి. జూలై నెల ౨౮ వ తేది కూడ సప్రూ జయకరు గార్లు మహాత్ముని దర్శించి నాలుగు గంటలు మాటలాడిరి. వారీ ప్రకటన గావించుచున్నారు:—

“మేము నిన్నను. నేడును. గాంధీ గారిని దర్శించి ముచ్చటించితిమి. మేమన్ని విషయములను వారికి దెలిపితిమి. వారు పండిత మోతీలాలు. జవహరిలాలు, నెహ్రూలకు సందేశము వ్రాసి యిచ్చియున్నారు. దానిని మేము అలహాబాదకు గొంపోవుచున్నాము„

ఇంతియకాక వీరు సరోజనీ దేవి, మున్షి, జమ్నాదాసు గార్లను కూడ చూచిరి. వీరు నిన్న అలహాబాదకు ప్రయాణమైరి

## స్థానిక వార్తలు

### సవరణ

గత సంచికలో ఇరువురు ఆత్మహత్య చేసికొనిరని వ్రాసియుంటిమి. అది నిజముకాదు. కాని ఇరువురు ఇంగ్లీషు వారు హుసేన్ సాగరుచెరువులో గాలివలన పడవ మునిగినందున మరణించిరి. వీరిలో నొకరు సైనికాధికారి రెండవవారు బొంబాయి నివాసులు.

### రెసిడెంటుగారు

గౌరవనీయులగు రెసిడెంటుగారు గత మంగళవారమునాడు సికింద్రాబాదనందలి బాలికా పాఠశాలను దర్శించిరి. ఒక గంటసేపు అన్నితరగతులను వీక్షించిన పిదప ఘాస్‌మండి మార్గ్యమిక పాఠశాలకు వెడలిరి.

### బ్యాండు వాద్యము

మాసాబదీ ప్రక్కనున్న యుద్యానవనములో ప్రతి శుక్రవారము సాయంత్రము ౫ గంటలనుండి ౭ గంటలవరకును, పురోద్యానవనములో ప్రతిసోమవారము అదేకాలములోను, బ్యాండువాద్యము జరుగును

## మహాత్మా గాంధీ గారు



వీరుసప్రూ జయకరుగార్లతో ఎరవాడ చెరసాలను డి మోతీలాల్, జవహరిలాల్ నెహ్రూగార్లకు సందేశ మంపిరి.

### సహాయము

కీ. శే. డాక్టరు సూర్యనారాయణ గారి భార్యకు ప్రస్తుతము రు ౧౦ ల నెలవ కొసగుట కంగీకరింప బడినది

### శ్రీ బాలసరస్వతి ఆంధ్రభాషా నిలయము

ఈ క్రింది మహాశయులు క్రింద యుదహరింప బడిన ఇంగ్లీష తెలుగు గ్రంధముల నిలయమునకు ఉచితముగా నిచ్చిరి. వీరి నిలయాభి మానమును ఔదార్యమును ప్రశంస నీయములు వీరికి నిలయ పక్షమున కృతజ్ఞత సూచించుచున్నాను

౧. మ॥ రా. బి యన్. శర్మగారు బి. ఏ: ౧౧ తెలుగు, ౧౯ ఇంగ్లీషు ౩. ఉర్దూ, ౧ హిందీ, గ్రంధములను దయచేసిరి.

౨. మ. రా, జ. అనంతరామశర్మ గారు; ౭ ఇంగ్లీషు పుస్తకములలను ౨ ఉర్దూ పుస్తకమును దయచేసిరి.

౩. మ॥ రా. దామోదర రెడ్డి బ్యారిష్టరు గారు ౭ ఇంగ్లీషు పుస్తకములను దయచేసిరి.

౪ మ రా. మాడపాటి హనుమంతరావుగారు ౫ తెలుగు పుస్తకములు ౨ ఉరుదూ పుస్తకములును దయచేసిరి.

ఇట్లు

బూర్గుల వేంకటేశ్వరరావు గా కార్యదర్శి

### జిల్లారక్షక శాఖాధ్యక్షులు

ఆర్మ్‌స్ట్రాంగ్ గారు సెలవై వెడలియున్నారు

### సప్రూగారు

డాక్టరు సప్రూగారు మునగాలవారి కేసులో ప్రభుత్వ సభలో వాదించుటకుగాను అగస్టునెల ౧౯ తేదిన రాను న్నారు

### బిన్నీగారు

ఇంతవరకు యువరాజులకు ట్యూటరుగ నుండిన బిన్నీగారు మరల మాల్గుజారీలో కార్యదర్శి పదవిపై నియమింప బడిరి

### దోమలపల్లివారి స్టేటు

ఈ స్టేటు కోర్టుఆఫ్ వార్డ్సు నుండి వారసుల కొసగ బడినది

### ఆంధ్రనిధికి విరాళములు

ఈ క్రింది విరాళములను కృతజ్ఞతా వందనములతో అందుకొనుచున్నాము:—

| | |
|---|---|
| శ్రీయుత సర్వోత్తమరావుగారు ఇనిస్పెక్టరు జిరాయితి, ఆరేరు | ౨౫-౦-౦ |
| శ్రీ రఘుపతిగారు మెదకు ఆరుమాసముల చందా | ౩౦-౦-౦ |
| మొ॥ | ౫౫-౦-౦ |

ఇట్లు విధేయుడు,

మా. హనుమంతరావు, కార్యదర్శి

### వాతావరణము

ఈ నగరమున నిత్య మప్పుడప్పుడు కొద్దివాన కురియుచున్నను ఎండ తీక్ష్ణము తగ్గలేదు. ఉక్కరా పోయుచున్నది. సాయంత్ర మాకాశము మేఘములచే గ్రమ్మియుండును కాని పుష్యమి కార్తిలో నొక పెద్దవర్షము మాత్రము కురియలేదు. నిన్న రాత్రి బాగుగ వర్షము కురిసినది. నేడుకూడ ముసిరియున్నది.

### జంతుబలులు

ఈ గురువారముతో దేవతలవద్ద మూగజంతువులను బలులిచ్చుట హైదరాబాదు, సికింద్రాబాదు పట్టణములలో సమాప్తి నొందినని చెప్పవచ్చును. శ్రావణమాస మంతయు జిల్లాలలో జరుగును కదా!

### ఆగాయార్జంగ్ బహాదురు

మాలు శాఖా కార్యదర్శులగు వీరు షహరేవరు నెల ౨౭ వ తేది నుండి ఉపకార వేతనముపై తొలగి పోయెదరు. వీరి స్థానే యెవరు వచ్చునది రూఢిగ తెలియదు. కాని బాందేడు జిల్లా తాలుక్దారులగు రహీముల్లా సా॥ వచ్చెదరని నొక వదంతి గలదు. కాను బిన్నీగారే ఈ కార్యము నిర్వహించెదరని కొందరనుచున్నారు. కార్యదర్శి పదవిపై యిదివరకు వచ్చినను బిన్నీగారు మాత్రము మాలుశాఖయందు యేదోనొక కార్యదర్శి పదవిపై నుండెదరను వార్త నిజము.

### బందోబస్తు శాఖ

ఈ శాఖయందు పనిచేయుటకుగాను నియోజితులైన మాలుశాఖోద్యోగులను అబాను ౨౫ తేది వరకు నుంచు టంగీకరింపబడినది.

### విశ్వవిద్యాలయ అప్పునిధి

ఈ పేరుతో నొకనిధి స్థాపించుట కంగీకరింపబడినది దీని మూలనిధి ౨౫ వేల కల్దారులు ఇందునుండి ఆధ్యాపకులకు విదేశములకేగి ఉన్నత విద్యనభ్యసించుటకుగాను ౧౦ వేల కల్దారుల మట్టుకు అప్పుగా నివ్వబడును. అప్పు గైకొనినవారు కనీసము ౫ సంవత్సరములైనను యుద్యోగమునందున్నవారుగ నుండవలయును. ౧౨ సంవత్సరములలో పటచెల్లించ వలయును. చదివి వచ్చిన తరువాత ఈ రాష్ట్రములోనే యుద్యోగము చేయవలయును.

### విందు

గురువారమునాడు రాత్రి పురోద్యానవనమున యువరాజులగు ఆజంజా బహాదురు జన్మదినోత్సవ సందర్భమున విందు జరిగెను. మహారాజా బహాదురును, ఇతర అధికార ప్రముఖులును వచ్చియుండిరి నిజాం ప్రభువుగారు రాత్రి ౧౧ ఘంటలకు విచ్చేసిరి. ఏరు యువరాజులను పుష్పమాలాలంకృతులజేసిరి అనంతరము నజర్లు జరిగెను.

### రెసిడెంటుగారు

వీరిప్పుడు రెసిడెన్సి కోఠీయందున్నారు.

